ఓం నమో భగవతే జ్ఞానానందాయ.

# హిమగిరిశతకము.



శ్రీమద్గురుజ్ఞానానందార్పితము

త్యాగికృతము.



ప్రకాశకులు:

శ్రీ మార్కండేయభవనము,

నరసరావుపేట.

గుంటూరుజిల్లా.

# కృతజ్ఞత.

శ్రీమద్జ్ఞానానందస్వాములవారి ప్రియభక్తులును 'ఉండి' కాపురస్థులునగు మహారాజశ్రీ ముదునూరి రామరాజుగారి ద్రవ్యసహాయమున నీగ్రంథము ముద్రింపఁబడినది. వారికి మా కృతజ్ఞతాపూర్వకవందనములు.

శ్రీ॥ శే॥ సూక్తినిధి వడ్డాది సుబ్బారాయకవిశేఖరులచే నీగ్రంథము సరిచూడఁబడినది. ఆకవీంద్రుని యుపకృతిని గ్రంథకర్త కృతజ్ఞతతో స్మరించుచున్నాఁడు.

ఇట్లు,

16—3—1938. ప్రకాశకులు.

# విషయసూచిక.



# హిమగిరిశతకము.



## ప్రశంస

శ్రీగణేశునిఁ గొల్చి చేరి యుమాకాంతు నర్చించి సంగమ్మ కంజలియిడి
వేదగిరీశు భావించి శ్రీనరహరి భద్రాద్రిజానకీపతినిఁ గొల్చి
సంస్కృతాంధ్రకవీంద్రసమితికిఁ గేల్మోడ్చి వసురాయకవివరుఁ బ్రస్తుతించి
సద్గురుస్వామి శ్రీమహితు జ్ఞానానంద గిరిపరాత్పరుని భక్తిని భజించి
యా మహాత్మునియానతి నతనికృపను । కోరి హిమగిరిమహిమ వాకొనఁగ నెంచి ।
మొదలుపెట్టెదఁ బెద్దల ముదలఁ గొనుచు । హిమగిరిస్థలిమాహాత్మ్య మెన్నఁదరమె॥ ౧

క్షితిఁ గొల్చుదండమై చెన్నొంది రెండువందలయామడల మేరఁ దనరియుండి
తిబ్బతు భారత దేశముల్ దాకి నల్వదియామడ వెడల్పుఁ బరగియుండి
రమ్యగౌరీశంకరంబు కాంచనగంగ మొదలగు శిఖరముల్ గదిసియుండి
పేటికాశ్మీరంబు భూటాను టెహ్రీ నేపాలదేశంబులఁ బ్రస్తుతమయి
ప్రథితమై శ్రీనగరముఖ్యపట్టణముల । రత్నకాంచననిధుల విరాజితమయి ।
త్రిభువనంబుల సరిలేక తేజరిల్లు ॥హిమగిరి॥ ౨

పారసీకతురుష్కబహుళ సేనాబ్ధికిఁ జెలియలికట్ట ప్రసిద్ధశిఖర
తార్తారదండయాత్రాప్రవాహంబుల నరికట్టి ఘనమైనయానకట్ట
నేపాళరాజ్యదుర్గాపారరక్షణ గురుతరమైనట్టి కోటగోడ
పరరాజదావాగ్నిభయసమాకుల హైందవాళికిఁ బ్రబలవర్షాంబుధార
దేవసంఘసమాకీర్ణదివ్యశాల। పుణ్యగంగానదీజన్మపూతభూమి।
సిద్ధమునివరసంఘసంసేవ్యవాటి ॥హిమగిరి॥ ౩

విపులవిశ్వవ్యాప్త వేదాంతవి ద్వివేకానంద నామవిఖ్యాతమూర్తి
వైదేశికప్రజావళ్యవిద్యాతమోరవి రామతీర్థసంప్రథితకీర్తి
నిజపూర్ణవిజ్ఞాననిర్మలహృదయ పూ ర్ణానందఋషిసంహృతాశ్రితార్తి
ప్రాక్పశ్చిమపరిజ్ఞాప్రణుతవిజ్ఞాని జ్ఞానానందగురువరుఁ డమృతసూక్తి
వేదశాస్త్రపురాణాది విదితమైన హిమవదద్భుతమహిమల నేకకంఠ।
తను బ్రశంసించియుండుట ననుపమంబు హిమగిరిస్థలిమాహాత్మ్య మెన్నఁదరమె॥

మానితచంపకమాలికాలంకృత, యుత్పలమాలికాయుతశుభాంగి
మత్తేభశార్దూలమహితవృత్తోపేత, కమ్రరుచిప్రదకందసహిత
సీసవినిర్మలచిత్రిత నిజరూప, శృంగారగీతికా స్థిరయశస్క-
"ఆటవెలదీ" నామకాంద్రాప్సరోంగనా నృత్తకౌశల్యసంప్రీతచిత్త
చారుపదయుక్త, సార్థకాత్కురసమేత। యైనబోధిశుభాకృతి, యస్మదీయ।
యలరు గంగోత్తరాప్రశంసాభ్యుపేత ॥హిమగిరి॥

దేశాంతరమున సద్ద్విజజన్మమునకంటెఁ జలికొండ నీచునిజనిరౌ మేలు
దేశాంతరమునందధీశుఁడై మనుకంటెఁ జలికొండ బంటయి నిలువ మేలు
దేశాంతరమునఁ గోటీశుఁ డయ్యెడుకంటెఁ జలికొండఁ బేదౌట చాలమేలు
దేశాంతరమున బలధీయుతుఁ డగుకంటెఁ జలికొండ దుర్బలజడుఁడు మేలు
చల్లగాలి విమలవారి సాధుమైత్రి। దయయు సత్యంబు శౌచంబు ధర్మనిరతి।
యతిథిసత్కృతి భక్త్యాదు లమరియుంట ॥హిమగిరి॥

సకలరక్షకమైన సంజీవనియు నుండు, హింసాత్మకము విషవృక్ష ముండు
కనదమూల్యములైన ఘనవజ్రములు నుండు, విలువలేనట్టిరాల్ పెక్కు లుండు
మృగనాథుఁడైయొప్పు మేటిసింగం బుండు, నల్పజంతువులైనయవియు నుండు
వరపరమానందభరితసాధువు లుండ్రు, కామార్తు లగుకొండకాపు లుండు
కేల వేశ్వేరువర్ణనం, బీయవార్య । మాపిపీలికాబ్రహ్మపర్యంతమైన ।
వస్తువులకెల్ల నెలవయి వరలుచుండు ॥హిమగిరి॥

అలవిష్ణుపాదంబు, నమరనాథాదులు క్షేత్రముల్ గలవు కాశ్మీరమందు
జాహ్నవీయమునలు జనియించు గంగోత్రి జమ్నోత్రి, టెహ్రిరాజ్యంబునందు
బదరికాక్షేత్రంబుఁ, బ్రథితకేదారంబుఁ, దీర్థముల్ గఢ్వాలుదేశమందు
కాట్మండు లుంబినీ కపిలవస్త్వాదులు, బౌద్ధాలయములు, నేపాలమందు
మఱియు సంఖ్యాతిగములైన మాన్యతీర్థ । సముదయంబుంట యాత్రికజనము వత్తు
రహహా! వారల లెక్కింప నలవిగాదు ॥హిమగిరి॥

## గంగానది.

హరిదివ్యపాదంబునం దుద్భవంబంది శివజటాజూటమ్ముఁ జేరుసాధ్వి
ఘనభగీరథుకోర్కె పిని సాగరులకు స్వర్గంబు నిచ్చినయుదారస్రవంతి
హిమశైలమునఁ బ్రవహించి భారతదేశమును పూతమొనరించు పుణ్యశీల
స్నాతులపాపాగ్నిఁ దనజలంబుల నార్చి ముక్తిఁ గల్పించు సంపూజ్యచరిత
సాగరునిముద్దు చెల్లించు సదమలాంగి, । ఋషులజీవననిధి, లోకహిత, పవిత్ర, ।
యుండు నిట గంగ, యోంకారయుక్తయగుచు ॥హిమగిరి॥ ౯

## కాశ్మీరము.

ఎచ్చోట భూలోకమే స్వర్గముగఁ దోఁచు, నెచటిసౌఖ్యమునకు నీడులేదు
ఎచ్చోటివనములముచ్చట వర్ణ్యమౌ, నెచ్చటిఫలతరు లెందు లేవు
ఎచ్చో విలాసార్థ మిం డ్లుండు నోడల, నెచ్చటిజలపాత మింపుఁగూర్చు
ఎచ్చోటమనమున కేకాగ్రతలభించు, నెచ్చట భవవార్ధి యిగిరిపోవు
ఎచట కుంకుమపువ్వు లభియించు మిగుల, । మేలుసేఁబు లెచ్చోట చాలదొఱకు, ।
నట్టికాశ్మీరనందన మమరియుండు ॥హిమగిరి॥ ౧౦

## కైలాసము

పార్వతీశ్వరపాదపంకజపరిపూత శిఖర మేగిరి యని చెప్పుచుండ్రు
సకలదేశావాససమధికసౌభాగ్య మంది యేకొండ విఖ్యాత మండ్రు
నిర్మలనీహార నిరుపమశోభచే రజతాద్రియని దేనిఁ బ్రజ వచింత్రు
ఘనతపోధనుల మోక్షస్థానములయందు నగ్రగణ్యం బేది యనితలంత్రు
సర్వలోకైకరమణీయసంపదలను । గలిగి జనముల కేది యాకర్షకంబొ ।
యట్టి కైలాసగిరియుండు నమలపదము ॥హిమగిరి॥ ౧౧

## మానససరోవరము

బ్రహ్మమానసమునఁ బ్రభవించినహ్రదంబు, బుద్ధవిహారప్రసిద్ధపదము
కైలాససామీప్యకలనఁ బ్రసిద్ధంబు, పౌరాణికస్తుతిపాత్రజలము
నిర్మలనీహారనిత్యజలావాస, మంచలబార్లకు మంచినెలవు
తైర్థికపాపనిర్దళనసమర్థంబు, తాపసబృందముల్ దనరుచోటు
మూడుకోటులదేవతల్ మునుఁగుతావు । గురుతరాధ్యాత్మికస్పందవరనిలయము ।
నైనమానసకాసార మమరు నెందు ॥హిమగిరి॥ ౧౨

## + ప్రకృతి +

### కొండలు.

కొండలా యివి కావు క్రూరశార్దూలాదివన్యమృగంబులవసతు లరయ
వసతులు కావివి, వనవాసిధన్యాత్మకృషిఫలధాన్యసుక్షేత్రచయము
క్షేత్రముల్ గావివి, భ్రమించుహిమకాంతిఁ గొమరొప్పు పెనువెండికుప్ప లన్ని
వెండికుప్పలు కావు, వితతభాస్కరకర ధగధగాయితభూరిధామము లివి
ధామముల్ గావు మణులచేఁ దనరునిధులు। నిధులు కావివి ఋషివరనియమవాటు।
లౌర! పర్వతసౌభాగ్య మద్భుతంబు। హిమగిరిస్థలిమాహాత్మ్య మెన్నఁదరమె॥ ౧౩

దరిగనుండిఁకొండ గురువృక్షపాషాణ వితతిచే భీకరాకృతినిఁ దోచు
నావలపర్వతం బగుపడుఁ బచ్చని పూలుగల్గుతివాసిపొంక మంది
యటుపైనిగిరియుండు నసితవస్త్రాచ్ఛాదితంబట్లు నున్నతిలముతోడ
నటుమీఁద హిమనగం బగుపడునవధౌతసితవస్త్రపటకుటిశ్రీ వహించి
వింతవింతల సోపానవితతి వెలసి। యంతు గనుపడ దెవ్వరి కెంతగనినఁ।
గన్నులరుఁ బండువొనరించు నన్నిదెసల ॥హిమగిరి॥ ౧౪

ఎత్తైనశిఖరంబు నెక్కి చూచెదమన్న యదిమించి మఱియొక్క టుచటఁ దోఁచు
దాని నారోహించి తనివిఁ జెందెద మన్న నట నభ్రమంటినయదొకఁ డుండు
నభ్రమంటినయది యబ్బిన దనుకొన్న దానిపైమబ్బునుఁ దాఁకు నొకటి
దానియగ్రం బెక్కి తరియించితి మటన్న నాపైనిచుక్కల నంటు నొకటి
యిట్లు పోవంగఁ బోవంగ నెంతదవ్వొ। పోవుటయెగాని యంతముఁ బోల్పఁదగదు।
శిఖరములయెత్తు నెవ్వరుఁ జెప్పలేరు ॥హిమగిరి॥ ౧౫

కొంతమేరకుఁ జెట్లు గొట్టినకొండలు పనికివచ్చును సేద్యమునకు మిగులఁ
గొంతమేరకుఁ జెట్లుగుట్టలు దట్టమై యుండుఁ నరణ్యంబు లొసగుఁ గలపఁ
గొంతమేరకు హిమవంతముల్ శిఖరముల్ భూర్జవృక్షంబులఁ బొలుచుచుండు
గొంతమేరకు హిమ మంతట వ్యాపించి కేవలంబుగ సితాకృతిఁ దనర్చు
నిట్లు నాలుగంతస్థుల హిమగిరి తగు। నచ్చటచ్చట తేయాకు నరటిపండ్లు।
సీమరేగులు మొదలగుచెట్లు పెరుగు ॥హిమగిరి॥ ౧౬

### కొండవాగు (చిన్ననది)

ఒకకొన్నికొండల నొదవించి మూర్ఖము సున్నంపుదిబ్బల నెన్నొ గూర్చు
నొకకొన్నికొండల నొనరంగ నులిచేసి పలుచోట్ల నిసుకతిన్నెలను గూర్చు
నొకకొన్నికొండల నూని సానలుదీర్చి చదరపుపెనురాల నొదవఁజేయు
నొకకొన్నికొండల నున్నవృక్షములెల్ల నిలఁగూర్చి పెనుదూలముల నొసర్చు
గొన్నికొండలఁ బెద్దపెంకులను జేయుఁ। దీవ్రవేగాన నొకర్షుకి తెలియరాదు,।
నిలయ మేతెన్ని నిర్మింపఁ దలఁచెనొక్కొ ॥హిమగిరి॥ ౧౭

## నీటి మాధుర్యము

కొండయావులపాలదండిమీఁగడకంటె, పాలుచిందెడు నారబ్రాలకంటె
నారముగ్గిన జహాంగీరు మామిడికంటెఁ, బ్రథితమైన నవేక్షురసముకంటెఁ
చిలిబీజములు గన్పట్టు దాడిమకంటె, పలుబాడు చక్కెరకేళికంటె
నమరిపాకమున నింపైన లడ్డూకంటెఁ దేఁటులూరెడు పుట్టతేనెకంటెఁ
దరుణినిరుపమమంజులాధరముకంటెఁ। బక్షిపతితెచ్చునమృతకుంభంబుకంటె।
మధురతర మౌర! తర్జ్ఝరీమధురజలము ॥హిమగిరి॥ ౧౮

## ఎత్తైనకొండసుదినుండి దృశ్యము

దూరముగా దోఁచుదొడ్డకొండలుగూడ వెన్నెలకుప్పల ట్లెన్నఁ దగును
క్రిందను గన్పట్టుకందవందల నదుల్ నీరుకలశారులచెలువు గాంచు
సస్య[illegible]బాలు తటినీప్రవాహముల్ రంగవల్లులయ ట్లెసంగుచుండు
ఓతులోయల జంతులును భూరుహంబులు బిఱుతబొట్టులయట్లు వరలుచుండు
చిన్నవస్తువులనుగూర్చి చెప్పనేల। దుర్భిణిని జూచినగాని తోఁచగలవె।
ప్రోన్న[illegible]నఁ బొలుచుచునరు ॥హిమగిరి॥ ౧౯

## కొండపాలములు

హిమగిరిసంవాసు [illegible] ధాన్యరాసుల నీయఁదనరునరలు
గిరిసరజ్ఝరిమున్గినరులపాపము దోలి స్వర్గంబు గూర్చుసోపానపంక్తి
వనరమాహిమగిరిపరిణయాలంకృత శుభమండపమునకు చుట్టుమెట్లు
కైలాసపర్వత లీలామహాగృహాంతరమునఁ [illegible] లివియొ
పసపుకుంకుమలను దిద్దవలసినట్టి। పార్వతీసుందరి [illegible]వారబంధము లివి।
కొండపాలము లటంచనఁగూడునొక్కొ ॥హిమగిరి॥ ౨౦

## తెల్లకొండలు, నల్లకొండలు

తెల్లనితేర్లట్లు దీపించుగిరులును, నల్లనితేర్లనఁ జెల్లుగిరులు
నైరావతములట్లు లమరుపాషాణముల్ దిగ్గజంబులకు నుద్దియగురాలు
నుచ్చైశ్శ్రవములట్లు లొప్పెడుచమరులు, కృష్ణాశ్వములనంగఁ గృష్ణహరులు
శ్వేతభటావళి చెలువొందుమార్గముల్, కృష్ణసైనికులను నేరుతరులు
సితహిమాస్త్రము లసితోపలతతిఁ దాల్చి। హిమగిరులు యుద్ధమునకు నహిమగిరులును।
దారసిల్లినయటు సమకూరె నొకట ॥హిమగిరి॥ ౨౧

## నల్లకొండపై తెల్లమబ్బు

గిరివిహారముఁగోరి యరిగినవిష్ణువు సరస కేతెంచినశర్వుఁ డనఁగ
బాలకృష్ణునితోడఁ బనివడి క్రీడింపఁ బ్రేమవచ్చినబలరాముఁ డనఁగ
అనుఁగుచుట్టం బగునష్టదిక్కరి జూడఁ, దరలినదైరావతం బనంగ
నీగ్రోలబలము నత్యుగ్రత నాక్రమింపఁగ వచ్చు హూణులబల మనంగ
నల్లగొడుగును గప్పిన తెల్లగొడుగు । నాఁగ నల్లనిదూరస్థమైనశిఖరి ।
నాక్రమించెను వచ్చి శ్వేతాభ్ర మొకటి । హిమగిరిస్థలిమాహాత్మ్య మెన్నఁదరమె॥ ౨౨

పరమేశుఁ డొకనాఁడు ప్రకృతినాటకసంఘ ములవేడ్క రావించి పోటిపెట్టి
మృగనాటకము ప్రదర్శింపుఁడు నావుఁడు, మబ్బులు కొండలు మత్సరించి
శశ్వేరుసంఘముల్ వేషంబుల నమర్చి, యేనుఁగులట్లు పేరెలుఁగులట్లు
శార్దూలములయట్లు శరభంబులట్టులు, నడవిపందులయట్లు హరులయట్లు
లగుచువివిధాకృతుల నవి యాటలాడె । నందు మబ్బులు లాఘవమంది పాఱె।
గిరులు జయమంది హరుసభ స్థిరములయ్యె ॥హిమగిరి॥ ౨౩

## సూర్యుఁడు

చలికి గాసిలుజనంబులు సూర్యరాకకై వేయివిధంబుల వేఁడుచుండ
బహుపక్షివృక్షముల్ ప్రబలమౌ హిమబాధ సహియింపలే కెంతమహిమ నొంచ
నేనుఁగు బెబ్బులి యెలుఁగు సివంగియుఁ దమ తావులఁ జూచు దరలుచుండ
మంచున నశ్రుపుల్ నించుపద్మిని తనమందువాసి వికాసమందుచుండ
బధిరులును మాటలఁ గదల్పఁ బయనమునకు । వేయివెల్గులదొరయదె విశ్వవివిధ।
వస్తువులఁజూప నుదయించి వచ్చెనిటకు ॥హిమగిరి॥ ౨౪

సర్వజలాశయసంశోషణాత్యుష్ణపటుతరకిరణ తీవ్రప్రవృత్తి
విశ్వమానవతృషావిర్భూతివేదనా వర్ధిష్ణుతిగ్మప్రభాప్రశస్తి
వృక్షలతాజంతు వితతినిర్మూలన దక్షోగ్రభానుసంతానశక్తి
యఖిలచరాచరానంతలోక విదగ్ధతాసమర్థాంశుప్రధానశక్తి
చండదీధితి! నేమయ్యెఁ జల్లనైతి । వతుల నీహారసతతపీడితుల నరులఁ।
గావుమందురు ప్రజలు భాస్కరు నుతించి ॥హిమగిరి॥ ౨౫

## సాయంసంధ్య

నిగనిగల్ పచరించుజిగిగల్గు తెల్లనిదగు నుత్తరీయంబు మిగుల మించి
బంగారుజలతారు రంగారు మేల్పట్టు శృంగారవస్త్రంబు రంగుమీరి
కాషాయవర్ణయుగ్వ్యాప్త వసనసంభూషితనవనవోన్మేష మంది
మాంజిష్ఠవర్ణాతిరంజితశాటీసుసంజాత కాంతులనున్ జయించి
కాళరాత్రిశిరోరుహపాళిమిగిలి । సంజకాంతుల నంతంత రంజితమయి ।
త్రోఁచి మేఘంబు సమ్మోదమాచరించు ॥హిమగిరి॥ ౨౬

అంబరంబనువనాభ్యంతరంబునఁ బొల్చి ప్రాచినతంగేడుపాద లనఁగ
నాకాశమనుమూస నజుఁడు సంధ్యాగ్నిని గరగించి పోయుబంగార మనఁగ
శశిబాలుఁ డుదయించుసమయంబునను సంధ్య ద్వారంబులను బూయుపస పనఁగ
రాబోవుయామినీపరిభుత సూచింపఁగ వుత్తడికేతనా లెత్తి రనఁగ
విరిసె స్వర్ధుని స్వర్ణాబ్జవితతి యనఁగ । పంజకాంతులతో నపరంజివన్నె ।
మేఘపటలంబు కసులరు మెచ్చొనర్చు ॥హిమగిరి॥ ౨౭

## మబ్బులు.

ఆకాశవిపణిలో నమ్మఁ బోరివులువోయుమౌక్తికంబుల నీలమణులయట్లు
నవపుండరీకముల్ నల్లగల్వలు వియన్నదిలోన గుంపులై యొదవినట్లు
హంసముల్ కోయిల లంబరవీధిలో నైకమత్యంబున నాడునట్లు
పండువెన్నెలలును బాదపచ్ఛాయలు గగనభూమిని జూడఁగలిగినట్లు
ధవళనీలాంబరంబుల దివిజవనిత । లారవేసినయట్లుఁబు నభ్రవీధి ।
సితము లసితము లగుమేఘశతులు దోఁచు ॥హిమగిరి॥ ౨౮

సూర్యోదయముజాడఁ జూడనీయవుగదా యస్తాద్రిసౌభాగ్య మరయనీయ
వెంతశతుత్వమో యొండపొడకు గన్నతుణములో దానిని గప్పివైతు
వెన్నెల నొకమారు వీక్షింపనీయవు దర్శింపనీయవు తారకలను
మంచుకొండలవన్నె మఱుగుసేయుదుగదా వలిగొన పెనుమంచువాన లెత్తు
వయ్య! మేఘుఁడ! నీధాటి కద్రిభూము । లాగినవి గాని యొండుల కగునెనిలువఁ ।
బోవగారాదె నిర్జలభూమిఁ జేర ॥హిమగిరి॥ ౨౯

ఇంతమేఘపుతున్క యేమూలనో తోఁచి యంతలో గగనంబు నాక్రమించు
నొక్కింతసేపటి కుఱుములు మెఱుములై కనుగొనరాక చీకట్లుగ్రమ్ము
నంతలో జడివాన లన్నిదిక్కుల నిండి వఱదలా ప్రళయంబు వచ్చినట్లు
లావంతతడవులో నంతటు జడిమాని యరకాలుతడిగానియవని యగును
నంతలో దిక్కులన్నియు సొబగు గాంచు, । నింతలోనసె నీలమైయొసఁగు మిన్ను ।
నింద్రజాలముగాఁ దోచు నిచటివాన ॥హిమగిరి॥ ౩౦

## గాలి.

ప్రళయవాతార్భటి బ్రహ్మాండభాండముల్ పగులునట్టులుగ వీవంగదొడఁగి,
ప్రబలవేగంబున బహుళమహావృక్షవితతుల వ్రేళ్లతోఁ బెల్లగించి
మదగజసమనీలమహితపాషాణముల్ వడి సెలవువ్వకై వడిని రువ్వి
గృహములు పశువులు గిరివాసిజనములు తల్లడిల్లగ వస్తులెల్లఁగలఁచి

తోడ వడగండ్లవానను దోడి తెచ్చి । కొండలఁ దుపానుగాడుపు, గుండెలదర ।
భీకరంబుగఁ దోఁచియు వింతగొలుపు ॥హిమగిరిస్థలి మాహాత్మ్య మెన్నఁదరమె॥ ౩౧

వరమురళీరవభ్రాంతి యొక్కొకమాటు, నొకమాటు మొరయుగీతికలభ్రాంతి
రైలుమోతయటన్న భ్రాంతి యొక్కొకసారి, యొకసారి మోటారునులివుభ్రాంతి
వాయువిమానంబుధ్వని భ్రాంతి యొకపరి, యొకపరి వరదలహోరుభ్రాంతి
పక్షిజలకోలాహలభ్రాంతియు నొకతూరి, యొకతూరి పిలుపన నొప్పుభ్రాంతి
వింతవింతలభ్రాంతుల సంతరించి । వృక్షములఁ గొండలను బ్రసరించుగాలి ।
గిరినివాస మెఱుంగనినరుల నొంచు ॥హిమగిరి॥ ౩౨

మబ్బుగాలియువాన, మబ్బువానయు నెండ, యెండవానయుమబ్బు, నెండమబ్బు
నెండగాలియువాన, యెండవానయు నెండ వానమబ్బునుగాలి, వానగాలి
వానయెండయుమబ్బు, వానమబ్బును నెండ, గాలియెండయుమబ్బు, గాలిమబ్బు
గాలిమబ్బును నెండ, గాలిమబ్బునుగాలి, మబ్బునెండయుగాలి, మబ్బుగాలి
గాలిమబ్బునువానయు, గాలియెండ । ఎండగాలియుమబ్బును, నెండవాన ।
మబ్బునెండయువానయు, మబ్బువాన ॥హిమగిరి॥ ౩౩

## మ ం చు.

పార్వతిపెండ్లిసంభారంబులకుఁ దెచ్చి యారఁగాబోయుబియ్యంపుపిండి
పిండివంటలకుగాను చేర్చిన గిరిరాజు పంచి తెచ్చినమంచిపంచదార
శ్రీపార్వతీశివుల్ చేరికూర్చుంటకై పఱచిన తెల్లనిపట్టుపఱుపు
మంగళాశీర్వాదమహితసేవ యొనర్పఁ బుణ్యాంగనల్ గూర్చుపూలవాన
శర్వుఁ డొనరించునట్టిహాసంబు సకల । సురలబువ్వంపుబంతికై సుధ, యనంగ ।
సంతటను జేరుకొనియుండు నమలహిమము ॥హిమగిరి॥ ౩౪

## చ లి.

ఉన్నిచొక్కాల్లాగు లున్నకంబళ్లెల్ల దరికిరప్పించునీదర్ప మడఁగ
పసిపిల్లలాదిగ ముసలుల ముదుకల పాయిజేరఁజేయునీపొగరు మాయ
ద్వారముల్ కిటికీలు వాయుమార్గము లన్ని బంధింపఁజేయునీబలము పగుల
యువతులకౌగిళ్ళ నుండిపూరుషులను విడనీయనట్టినీబింక మింక
ఋషుల గుహలను జేర్చునీరోష మిగుర । పసులఁ బక్షుల బాధించువైర మార
ముచ్చుమూడింతు చలి నీదుపొంక మడఁగ ॥హిమగిరి॥ ౩౫

ఈఁగలన్ దోమలు వెనలేనిశత్రువు, నల్లికి మృత్యువు, బల్లి కరియు
సర్పంబులకుఁ దేళ్లసంఘములకుఁ జావు, నెల్లచీమలపాలిహింసకంబు
దొంగలకును జేరదూర నశక్యంబు, దొరలకు దండెత్త దొడ్డయడ్డు
ఉగ్రవిషూచ్యాదికోరుబాధాదూర, మత్స్యష్టపీడకు నంకుశంబు
బిందుమాత్రమేన్ జమటకుఁ బెద్దకలవు, । దావకీలల నడఁగించుదండిబంటు ।
చలిని కేవలమును నిందసలుపఁజనదు ॥హిమగిరి॥ 3౬

ఎండలోఁ గూర్చుండుటే మహాపుణ్యంబు, కుంపటిఁ జేయుటే గొప్పఫలము
కంబళి గప్పుటే కడుపూర్వసుకృతంబు నుష్ణపధారణ ముత్తమంబు
గుహాలలో నిండ్లలోఁ గూర్చుండుటే గొప్ప, చలిసహియించుటే సాహసంబు
వెనముపైఁ బ్రొట్టెయే తినపురోడాశంబు, నుష్ణోదకంబు పీయూషధార
కాల్యములఁ దీర్చికొనుట యస్తుప్రశాంతి, । వారమున కొక్కస్నాన మపారసుఖము ।
చలిని నిట్లయ్యు సంతృప్తిఁ గలుగు బుషికి ॥హిమగిరి॥ 3౭

## జంతువులు.

గాఢాంధకారంబు గల్పించు ఘనముగా చీఁకటిమ్రాకులప్రాఁకునీడ
నీడలందునఁ దమజాడ గన్పడకుండ నెరలకై వెదకెడుచిఱుతపులులు
పులులజాడ రవంత పొడగని గుప్పించి దుమికి పర్విడునట్టిదుప్పిగుంపు
గుంపులుగా లేచి కొన నాకలములు మెక్కుమర్కటములు పెక్కుకరులు
కరులవలె దోఁచుకిరులును గారెనుములు । ములుపొదలఁ దూరు నేదుపందులకొదమలు
నహహా! భయదము లయ్యు మోదావహములు ॥హిమగిరి॥ 3౮

రాజాధిరాజవిరాజతేజంబున భీకరం బగుకేవిఁ బెద్దమెకము
వెంగలాయిపాదుపాభోగలాలస మయి మహనీయమై పొల్చుమత్తగజము
దండినుబేదారుదర్పంబుఁ జూపించుబలిమిగల్గినయట్టిరొలుఁగుబంటి
మించి గర్వముతో జమీందారుహోయలున హెచ్చుగా దోఁచెడునిట్టికోడమ
యాయు రారోగ్యభాగ్యంబు లందియున్న । మనుజపుంగవు లటులుండుమన్నపోతు।
జరుపు నెల్లెడ స్వేచ్ఛాప్రచారలీల ॥హిమగిరి॥ 3౯

వాలిసుగ్రీవులవంశంబున జనించి వర్ధిల్లువానరవర్యులార
జాంబవంతునిబంధుజాలమై పుట్టినభల్లూకనామకప్రముఖులార
శ్రీజటాయువుకులశేఖరులుగ జన్మమందినగృధ్రఖగాదులార
శ్రీరామకరుణను జెంది ప్రసిద్ధిని గాంచినయుడుతలకదుపులార

తానమును గూర్చువేణునిస్స్వాన మొకట। వాయుచాలితవృక్షరవంబు లొకటఁ
గలసి శ్రుతిపేయమై మోదజలధిఁ దేల్చు। హిమగిరిస్థలి మాహాత్మ్య మెన్నఁదరమె॥ ౮౯

కొండయావిరి మేఘమండలాకృతి లేచి నలుదెస చీకట్లు గొలుపు సాగసు
మేఘముల్ జనులకు మీదుగా క్రిందుగా నంతటఁ జరియించునట్టి సొగయలు
సితపుష్పవిసరమో చిఱుదూదిపింజలో యన మంచు వర్షించునట్టి వింత
వడగండ్లు వర్షము ప్రబలమారుత ముఱుగర్జలు మెఱుపులు గాలివిధము
కొండకూలుట పెనుమంచుకొండ పడుట। చలివలియు సింహగర్జ వృక్షములయూపు
ననుభవించుట పరమభాగ్యంబుగాదె! ॥హిమగిరి॥ ౯౦

---

## ✢ ప్రజలు ✢

వేదవేదాంగాదివిహితపూర్వాచారపరులు శుద్ధులు విప్రవరులు గలరు
ప్రాచీనరాజర్షి వంశసంభూతులై కడుమించు క్షత్రపుంగవులు గలరు
వైశ్యసంఘము లేమి వాణిజ్యమును బూని వరలు విప్రక్షత్రవరులు గలరు
సేవాసమాచారశిక్షగాంచిన శూద్రకులజులు డోమ్నాములును గలరు
ఆటవికులని పల్కు వాక్యంబె కాని। నాగరకలక్షణంబుల నవ్యకళల।
శోభితులు గిరివాసులు సుగుణరతులు ॥హిమగిరి॥ ౯౧

నిరతహిమపాతపరిపూర్ణధవళిమ నన పాండురంబైనయట్టి టోపి
వదనారవిందశోభావివర్ధక మగునిండు మేల్పంగరుమండలములు
స్వర్ణదేహచ్ఛాయ సంఛన్నముగఁ జేయు నమలోర్ణనిర్మిత మంగరక్ష
హొపులు గట్టుకో మొలఁజుట్టుకొనియున్న త్రాట వ్రేలెడులవిత్రంబు నొకటి
పొరుపైజామ బఱువుమోజాలు గలిగి। ప్రేయసీవాక్సుధారసప్రీతిఁ దవిలి।
త్రాగు హుక్కాను క్షత్రియ తల్లజుండు ॥హిమగిరి॥ ౯౨

రంగుపాగా దాల్చురమణి, బంభరవేణి, ముంగర దాల్చిన మోహనాంగి
చిఱుచుక్క మోమునఁ జెలఁగుచందాననం, తాంబూలలసితసుధాధరోష్ఠి
కెండికంటె ధరించు వెలది కంబుగ్రీవ, గురువింద పేరులఁ గులుకు కలికి
ఘాగరఖాదొడ్డునట్టి పృథుశ్రోణి, గాగరా ధరియించు కరికరోరు

పండెలున్ మట్టియలు గల్గునంఘ్రియుగళి, । యంగుళీయకలసదరుణాబ్జపాణి ।
వహ్వారే పైడిబొమ్మ ఘుర్వాలికొమ్మ ॥హిమగిరి॥ ౧౩

పాంచాలిదగ్గతిబంధువు లని తెల్ప భ్రాతలందఱ కొక్కభార్య సాక్షి
యప్సరఃకాంతల కందినవారన మార్మనుములపెండ్లి మహితసాక్షి
గంధర్వకిన్నరకాంతలసంతన గానమాధురి బలమైనసాక్షి
యక్షకాంతలకు వీ రైనవా రని తెల్ప సౌందర్యసంపద చాలుసాక్షి
ఋషులసతులకుఁ దోడఁన గృపయె సాక్షి । గాంగజలపానసితగిరికమ్రివాస ।
భాగ్యసంయుత లింతులు యోగ్య లరయ ॥హిమగిరి॥ ౧౪

ప్రొద్దుననేలేచి నుద్దిచేసి గృహంబు, పాలిచ్చి బిడ్డకు పసుల విడచి
కాంతు సేవించి, హుక్కా నిచ్చి యతనికి షడ్రసయుతపాకసరణిఁ దీర్చి
కాడి కెద్దులఁ బూన్చి వేడుక బతితోడఁ గొడవలి పారయుఁ గొంచు నరిగి
పొలముపనుల్ దీర్చి, యిలుసేర్చి గడ్డిని, కొండకట్టెలఁ దెచ్చి, వండి మఱల
సంజపడకుండ గృహమును సరిదివైచి । పతికి సుఖమును జేకూర్పఁ బాటుపడెడు ।
ననుదినంబును గిరిచరవనిత యచట ॥హిమగిరి॥ ౧౫

## గి రి బా లుఁ డు

ఉన్నిచొక్కాయయు నొకగోచిపాతయు టోపియుమాత్ర మాటోపములుగ
శిశులాలనంబును బశుపాలనంబును బఱువుమోయుట లాటపాటలుగను
రొట్టెయుఁ బల్చనివట్టిసూపము పచ్చికూరయె కడుపారునోరెములుగ
వింతవారలవైనవేషభాషలఁ గాంచి బెదరి పారుట తనబీరముగను
రజితభూషలె వైభవరంజనముగ । నందచందాలు తనదుపిత్రార్జితముగ ।
గలుగుగిరివాసిబాలుని గాంచఁదగును ॥హిమగిరి॥ ౧౬

## గి రి క న్య

శివునిగూర్చి తపంబుఁజేయఁగ హైమాద్రి వసియించునట్టిపార్వతివో యేమొ
భవువిల్లు ద్రుంచు నాయునరామచంద్రుని తనివారఁ జూచుభూతనయ వేమొ
మత్స్యయంత్రము జలమధ్యంబునన్ జూచి యేయునర్జును జూచుకృష్ణవేమొ
యనుకూలుఁడౌవరు నర్థించి కుమ్మరులలితాంగి యగువనలక్ష్మివేమొ
తరమె నీశోభ వర్ణింపఁ దలిరుబోణి । పార్వతీయులకన్య మేల్ వరుని బడసి ।
భాగ్యసౌభాగ్యవైభవప్రాప్తి మనుము ॥హిమగిరి॥ ౧౭

## గిరిశిశువు

ఒలికింతు మోమున నడురాజచంద్రికాధవళహాసద్యుతిధగధగలను
చిలికింతు నవ్యక్తలలితభాషణములఁ గలకంఠకాకలీకలితరవము
కులికింతు మెడలోనిపులిగోళ్ళ పతకముల్ తనిసి చూపుచు ప్రమోదమునఁ జేల
గదలింతు పాదముల్ కమనీయహస్తము లున్నిపాత్రిళ్ళలోనుండి మిగుల
నేద్య వొక్కప్పుడైన ని న్నింట విడచి। తల్లియొప్పటికో వచ్చి స్తన్య మిచ్చు।
నార! గిరిశిశు! నీయాత్మ నరసి మెత్తు। హిమగిరిస్థలి మాహాత్మ్య మెన్నఁదరమె॥ ౧౮

## గృహములు

దారునిర్మితగృహాధఃశ్శాల పశువులు నుపరిసౌధంబున నుందురు జనము
లొక్కొక్కగదియం దొక్కొక్కసంసారంబు నిఱుకైనచిన్న వాకిండ్లు ముందు
చీకటిగదులలో చీడిపుల్లలపొగ నల్లబారినగోడ తెల్లసరకు
లొకమూలపాత్రయ్యయు నొకమూలశయ్యలు నొకమూలసంభార మొకట యట్లు
జేవదారువుకాగడా వెలుపువఱకు। నెవరికెంతేమి యున్నదో యెఱుఁగరాదు।
గంథిలంబులు గృహములు గామదములు ॥హిమగిరి॥ ౧౯

## పశువులు

తన్నవు పొడువవు తనరు సాధువులౌచు తమగ్రాసమును దామె వెదకి తినును
కామధేనువులోలెఁ గమ్మనై తియ్యనై జిడ్డుదేరెడునట్టిక్షీర మొసగు
నక్కరయైనచో నధికంబు లగుభారముల మోసికొని శైలభూము లెక్క
రాత్రులు పులులేని రా భీకరాకృతిఁ గొమ్ములనూదుల వాని గ్రుమ్మి చంపు
పాలమూదన్నఁ జుఱుకుకోడెల నోసంగు। నించుకేనియు వేడి సహింపలేవు
గోవులా! యివి మోక్షంపుఠావు లరయ ॥హిమగిరి॥ ౨౦

## అతిథిసత్కారము

ఇదియె ప్రణామంబు హేమమహారాజ! మీ కలరునె కుశలమంగళము లెపుడు?
దయసేయ డిచ్చోట దయతప్పినారలు కంబళి కుంపటి గాంచు డిదియె
యెందుండి దయను మీ రిందు విచ్చేయుట? పావనమయ్యె మాభవన మిపుడు
పశువులు శిశువులు బంధువుల్ క్షేమమే? కొండపాలంబులు పండునుగద?
యిదియె చల్లనిపానీయ, మిదియె హుక్క। యీగృహమునుమీదె గైకొనుఁడిదియె రొట్టె
యనుచు గృహాధర్లతిథుల నాదరింతురు ॥హిమగిరి॥ ౨౧

కొండకోనల నాకుకూరలు తెప్పించి నేతితో వేయించి నింపుఁ బాత్రి
1 జంగ్లాలతో 2 గర్మసాలాయు వడియములన్ చేర్చినపులుసుంచుఁ జిన్నపాత్రి
జోగిచినపొదినాకు తగునూనె మిరెముతో నొనరించుపచ్చడి నొక్కపాత్రి
మంచిద్రాక్షాదుల నుంచి శ్రీరాన్నంబు వండి వడ్డించు వేఱొండుపాత్రి
పూరి, యన్నము, రొట్టెయు, నూరుగాయ,। పప్పుబెను, బిండివంటలుఁ బలుగుపాత్ర।
బుంచి, కంచాన నతిథికి నొసగు గృహిణి ॥హిమగిరి॥ ౬౨

వేయించి బాగుగా విసరుయవలపిండి బెల్లంబుతో నానఁబెట్టి యిచ్చు
గోధుమ, నేయి, పాల్ కొంతబాదం పిస్త కలిపి ప్రసాదంబుగా నొసంగు
పచ్చకర్పూరంబు నచ్చకుంకుమ పువ్వు చేర్చినలడ్డువ చేసి యిడును
కుంచిపాకముతోడ నుంచి జిలేబీని రంగుగాఁ దృప్తిదీరంగఁ బెట్టు
దూరగిరిలభ్యమైన యంజూర, 3 చూలు,। సీమరే గాల్బుకారలు పేర్మిఁ గూర్చి।
ధూప మతిథికి గృహిణి కస్తురి నొసంగు ॥హిమగిరి॥ ౬౩

ఇంట నీడ నివాస మెంచ శత్రుస్థాన, మెండయే పరమాప్త మెల్లయెడల
కార్పాసవస్త్రముల్ కంటకప్రాయంబు, లూర్ణవస్త్రంబులే యొసగు హితవు
వేడివంటకములు విహితముల్ రుచ్యముల్ చలిదిభోజ్యము రోగసాధకంబు
మంచానిలంబులు మలయు నెచ్చోఁగన్న, నుష్ణవాయువు మృగ్య మెంకటనైన
పేయముల్ గాంగశీతలప్రియజలములు,। భావ్యముల్ పూర్వసంయమివర్తనములు
ధ్యేయముల్ చంద్రశేఖరుదివ్యకళలు ॥హిమగిరి॥ ౬౪

4 పైజామదీసి ధోవతిగట్టినంతనె పరిశుద్ధ మగుచుడి వరలినట్లు
పోయిదరి వర్జించిపోవ నేమాత్రమేజ్ పాకమంతయు 5 ఝూటుపడినయట్లు
రొట్టెకు మైలలే దట్టుకు మైలలే దన్నంబుపప్పున కగును మైల
మంచినీరేజాతిమనుజుఁ డిచ్చినఁగాని త్రాగనా నపవిత్రతన్ గనండు
అంగియును బాదరక్షలు నటులె టోపి। విడిచిచరియింప మర్యాదవిడిచినట్లు।
లెన్నొ యాచారములు హేతు విందు చలియె ॥హిమగిరి॥ ౬౫

---

1 దుక్కగొడుగు. 2 మసాలా. 3 ఒకవిధపుగుపండు. 4 లాగు. 5 ఎంగిలి.

1 ఆజా 2 జాణే 3 లగా 4 పాణి 5 కకటిటి యాదిపదములు గూడినప్రాకృతంబు
మొకల మంగళ కృపా 6 కో 7 న్వథవా మొదల్ శబ్దముల్ గల్గినసంస్కృతంబు
8 అయిదే మహారాజ్ఞి హై 9 ఖలీకా మను నీగభీరోక్తుల హిందిభాష
10 అక్సరు 11 బద్మాషు 12 అల్లా 13 ఖుదా యనునుగ్రవాక్యంబుల నురుదుపలుకు
లమిడునాలుగుభాష లవ్యక్తరీతి । మేళనంబంది సంఖ్యను మించినట్టి ।
కొండభాషలు పెక్కులు గూర్చు వింత। హిమగిరిస్థలి మాహాత్మ్య మెన్నఁదరమె॥ ౬౬

చేయి ముంచిన నీళ్లు జిల్లున జలిపుట్టు కొంగరపోవును కొయ్యబాఱు
నోట బెట్టగనె పండులు జివ్వుమనిలాగి క్రమముగా దవడలు కదియఁబడును
గొంతులోనికిఁ బోవ సెంతరోబాధను గల్గించు మాటాడఁ గష్టమగును
కడుపులోఁబడి వడగండ్లతో నింపినపోలిక బరువగు, పోటుబుట్టు
మేనఁజలివుట్టు, కంపంబు మిగులఁగల్గు । నట్టిశీతోదకంబులె యమృతమంచుఁ,
గ్రోలుదురు గాని యితరంబుఁ గ్రోల రచట ॥హిమగిరి॥ ౬౭

అడుగున్నరవెడల్పు నటు కొండ యిటు లోయ నేటవాలగురాచబాట యొకటి
యడ్డముగాఁ గొండలన్ని దాటుచు నేగుపగ్డండి యను కాలిబాట యొకటి
గిరిచుట్టు మెలికలుతిరిగి శిఖరమెక్క పశువులు చరియించుబాట యొకటి
పైని నాకాశంబుఁ బర్వతంబులు క్రిందఁ బఱగుగుర్తులులేనిబాట యొకటి
పైకి నెక్కించుచోటులు పలుగురాళ్ళు ! గుట్ట లారులు ముండ్లున్నకోన నేగు
తెరువు లిచ్చట ప్రజదక్కఁ దెలియరెవరు ॥హిమగిరి॥ ౬౮

ఒకయింటినుండి వేఱొకయింటి కేగఁగ నొక్కకొండంతయు నెక్కవలయు
నొకయూరినుండి వేఱొకయూరి కేగఁగ నిరుమూడుకొండలఁ దిరుగవలయు
నొకకొండనుండి వేఱొకకొండ కేగఁగఁ బర్వతంబంతయుఁ బ్రాకవలయు
నొకయాత్రనుండి వేఱొకయాత్ర కేగఁగఁ బదువాఱుయోజనా ల్పఱవవలయు
పెద్దలు తలంపువత్తురు పిదప మనసుఁ । బ్రాణ మవియును గావిట రైళ్లు బండ్లు, ।
నిచటిజను లవలీలగ నేగగలరు, ॥హిమగిరి॥ ౬౯

---

1 వచ్చుట. 2 పోవు. 3 మొదలిడు. 4 నీరు. 5 ఎక్కడనుండి. 6 ఎవరు. 7 లేక. 8 రండు. 9 మంచిపని. 10 అధికము. 11 చెడ్డవాఁడు. 12 దేవుఁడు. 13 రక్షకుఁడు.

కోసురాళ్లకు ముండ్లకును గుట్టలకు నుంత గొంకనిపాదముల్ కొండప్రజకు
జలిగాలికిని నీటిచలికి మంచునకును గొంకనిహస్తముల్ కొండప్రజకు
ముడిరొట్టె ముడిపప్పు ముడిమాంసములఁ దిన గొంకనియుదరముల్ కొండప్రజకు
నమవస నర్ధరాత్రమునఁ జీకట్లకుఁ గొంకని నేత్రముల్ కొండప్రజకు
క్రూరజంతువులను గన్నఁ గొంకనిహృది। ఘోరకష్టములందైనఁ గొంకనిమది।
నీశ్వరుఁడు కొండవారల కిచ్చెఁగృపను ॥హిమగిరి॥ ౨౦

---

## నై తి క ము

అమ్మపై నయ్యపై నల్గి యిచటికి రాకు చలిబాధ నోర్వంగఁజాలవేమొ
కూటికి లేదనుకొదువ రా కిచటికి చలిదిరొట్టెలఁ దినఁజాలవేమొ
కండలు గలవని గర్వించి రాకుము గిరులెక్క నీకసుల్ దిరుగునేమొ
మెట్టవేదాంతంబు మిడికి రాకిచటికి మృగములరొదగని పొగులుదేమొ
పట్టిసన్యాసమున రాగ దట్టుకొనఁగ। కష్టముల దుర్ఘటంబగు గట్టిత్యాగ।
మొంది దేహాశవిడ నిట నుండవచ్చు ॥హిమగిరి॥ ౨౧

అప్పుడే కరగినయట్టిహిమాంబువుల్ ప్రబలశైత్యముతోడఁ బాఱుచుండు
నలువైపులన్ దూదిసలుసులవలె మంచుకణములు రాలుచో వణకుబుట్టు
హిమశిలాఖండపృథులజంఘావాత మున్నిబట్టలఁ జాలకుండఁజేయు
నాకసంబున గవియున్నమాటయె గాని యూష్ణ మావంతయే నొదవకుండు
నిత్యమును స్నానమును జేయనేర రనుచు। నపహసించుట తగదునుమ్మచటివారిఁ।
మునుల కచ్చట స్నానమే యనవసరము ॥హిమగిరి॥ ౨౨

రాజులకని వేఱురస్తాలు లేవిట బంటులకని వేఱుబాట లేదు
ప్రభువులకని వేఱుభవనముల్ లేవిట ప్రజకని వేఱొకపంచ లేదు
ధనికులని వేఱుధాన్యము లేదిట బీదలకని వేఱుపిండి లేదు
అగ్రజన్ములకని యాసనంబులు లేవు నీచులకని వేఱునెలవు లేదు
అందఱకు నొక్కటే బాట యదియె పంచ। గోధుమంబదె రొట్టెకుఁ గొండెలవియె।
నెలవు, సర్వసమష్టితి నెగడుచోటు ॥హిమగిరి॥ ౨౩

ఇచట నుండెడిపక్షి కిశవు శీతలవారి త్రాఁగ నన్యుల కది తరముగాదు
ఇచటనుండెడిపక్షి కింపు మండువరొట్టె నమల నన్యుల కజీర్ణత ఘటిల్లు
నిచట నుండెడిపక్షి కిష్టము చలిగాలి పరవ నన్యులపయి వణకుఁబుట్టు
నిచట నుండెడిపక్షి కిచ్చ కొండలఁ బ్రాక నడవ నన్యుల కట సడుగుపడును
ఒకరియమృతము విషము వేఱొకరి కగును। జననియును జన్మభూమియు స్వర్గమందు,।
నైన నెల్లరకును బూజ్య మీనగంబు। హిమగిరిస్థలి మాహాత్మ్య మెన్నఁదరమె॥ ౨౪

ఈఁగలఁ జంపెడు నీతొండ క్షణములో, తొండను మింగెడు దొడ్డపాము
పామును గబళించి పర్విడు దుప్పియు, దుప్పిని హింసించుఁ గొప్పపులియుఁ
బులిని దంతంబులఁ బోకార్చు నేనుఁగు, నేనుఁగుఁ జెండాడు నిభవిరోధి
యిభవిరోధినిద్రుంచు నీవేటకాఁడును వేటకానిని జంపి వెడలు నెలుగు
హింస నీరీతి నజుఁడు సృజించె నిచట, । ప్రాక్కృతవిపాక మీరీతిఁ బఱగుచుండు।
నైన మానులకడ హింసలన్ని యడఁగు ॥హిమగిరి॥ ౨౫

అడవిని రక్షకుండగు నీశ్వరుండను సూక్తి యన్వర్థము సూరి కిచటఁ
దల్లియుఁ దండ్రియుఁ దైవమున్ గురుఁడె యన్ మాట సార్థకమగు మౌని కిచట
సర్వంబు నశియించు సత్పదార్థముదక్క యనుట సత్యంబు సుమ్మార్యున కిట
నిల్లు నిల్లాలు తా నేగునప్పుడు కూడరా రనుట నిజంబు ప్రాజ్ఞున కిట
తినుటకే కాదు మన మిల జనన మైతి। మంతులేనట్టిఘనకార్య మవల నున్న।
దనెడు నిజమైనవేదాంత మనుభవ మిట ॥హిమగిరి॥ ౨౬

సర్వేశ్వరానంతశక్తి యొక్కటె యుండు భూతపిశాచాదిభీతి వలదు
సార్వకాలికరవిదీప్తి యొక్కటెయుండు నగ్నిభయంబున కడలఁజనదు
నింద్రియబలచౌర్య మెన్న నొక్కటె యుండు ధనతస్కరులబాధఁ దలఁపరాదు
ఘనముక్తి నర్థించు కాంక్ష యొక్కటె యుండు కామాదివర్గము గనఁగలేదు
షడరిజయమును భవబంధశమమె గాని। సర్పవృశ్చికజలరాజశత్రుభయము।
తడవఁదగ దిట వానికిఁ దావుగలదె ॥హిమగిరి॥ ౨౭

శివునాజ్ఞలేనిది చీమయేనియుఁ గుట్ట దనుమాన మింతలేని కనుట తగునె
శక్తిని పదమిడనిది వృశ్చికము గుట్ట దనుమాన మింతలేని కనుట తగునె
క్రూరశార్దూలమున్ గొట్టక పైఁబడ దనుమానమింతలేని కనుట తగునె
సరకంటఁబడకుండెఁ దిరుగును మృగ మెప్పు దనుమాన మింతలేని కనుట తగునె

కత్తి చేలేనిచో గొత్తి కఱచుననుట । సాహసమె లక్ష్మి యంచను సామెతయును
సత్యము లటంచు నిచ్చట స్వానుభవమె ॥హిమగిరి॥ ౨౮

ఒఱగద్దమునుండి యొంటిగిఱ్ఱాలరె యట వినఁజెప్పుమీ యను వెఱ్ఱియొకఁడు
క్రూరమృగంబులు కొఱికివేయవె యట వచియింపుమనుపిచ్చివాఁ డొకండు
చలిచేత వలిగొని చావరే యచ్చట వివరింపు మని యనుభీరు వొకఁడు
వ్యాధుల కౌషధసాధనములు లేమి యణఁగరే యట యనునసద యొకఁడు
ఇటులు దేశస్థు లడుగుదు రీశుఁడెచటు । నొక్కఁడే సుమ్ము రక్షించు నూర నడవి
నాపదలులేవు చలికొండ నాయు వెచ్చు ॥హిమగిరి॥ ౨౯

---

## స్వీయము

తలఁపు జనించినంతనె హిమగిరిత్రోవఁబట్టనిదే బుద్ధి పదిలపడదు
త్రోవపట్టిన నేమి తొంబదియామడల్ గడచుట యుగములు గడచినట్టు
లటు నడుగిడఁగనె యౌహా మదీయంబు జన్మము సఫల మన్ సరణి నుండు
నేకాంత వనవాస మెపుడు లభించిన నపుడె బ్రహ్మానంద మగును మదికి
గడువుదీరఁగ నింటికై వెడలునప్పు । డున్నరను ప్రాణ, మెల్లపు డుండి తపము ।
సేయఁగలవారిపుణ్యముఁ జెప్ప నేల? ॥హిమగిరి॥ ౩౦

కంటిని పార్వతీకాంతునినిలయమ్ము నంచితోత్తుంగమౌ మంచుకొండ
కంటిని హరజటాకప్రజూటవిహార గంభీరసలిల గంగాభవాని
కంటిని పరమర్షి గణముఖ్యసంవాసకీర్తివాసితమైనగిరిగుహాళి
కంటిని మంజులాకారమరుద్ధూతవితతశాఖాయుతవృక్షచయము
కంటి వివిధంబు లగుజంతుకాండములను । కంటి రాగవిహీనుల ఘనుల మునులఁ ।
గంటి గురువర్య ధన్యత మంటి నేఁడు ॥హిమగిరి॥ ౩౧

ప్రాతర్విహంగమరమణీయమాగధపుణ్యగీతాళిప్రబోధకలన
గిరిరాజతరమంత్రిచరజంతుభటయుతప్రాణిప్రజాసభాభవనవసతి
మధ్యాహ్నతరుఫల మధురస్రవంతినీజలపాయసోపేతసరసభుక్తి
సాయంసమారంభసాంద్రమరున్మిత్రసహితవిహారప్రశస్తరక్తి
రాత్రినక్షత్రశశియుతరమ్యగగన । పటలగేహాంతరైకాంతభద్రనిద్ర ।
దివసరాత్రిజవిభవసంతతిఁ గంటి ॥హిమగిరి॥ ౩౨

అయ్య ! వసిష్ఠ ! రావయ్య ! విశ్వామిత్ర ! రండు సప్తమహర్షు లండ నాకు
నయ్య ! వాల్మీక ! రావయ్య ! వ్యాసాచార్య ! రండు జగద్గురు లండ నాకు
నయ్య ! శంకరుఁడ ! రావయ్య । యానందాద్రి ! రండు జగద్గురు లండ నాకు
నయ్య ! విశుద్ధాఖ్య ! యయ్య ! పూర్ణానంద ! రండు గురూత్తము లండ నాకు
మద్గురుప్రభు ! రావయ్య! మహితచరిత । యీతటీరతపంబున కీవె యండ ।
మదినిమిముగొల్చి యోంకారమహిమఁగందు।హిమగిరిస్థలి మాహాత్మ్య మెన్నఁదరమె ౨౩

కైలాసమానసఖండమునన్ బ్రణవానంద నామమహాతపస్వి
గంగోత్తరాఖండకందరమునఁ బ్రశాంతానంద నామవిజ్ఞానమూర్తి
బ్రహ్మకపాలానఁ బ్రజ్ఞానపూర్వకానంద నామక మునివందితుండు
కాశ్మీరసురుచిర కాంతారముల మహాశంకర నామకసాధుమౌళి
న్యాయమూర్తి గంగాప్రసా దల్లబెహిరి । సాధుభక్త భూమానందసఖుఁడు ముఖుఁవ।
మొదలుగాఁగలమన్మిత్రముఖ్యులుండు ॥హిమగిరి॥ ౨౪

ఆచార్యుఁడు మహర్షి యైనపూర్ణానందవరునిహృషీకేశవాస మిదియె
గురుఁడు జ్ఞానానందపరమర్షి పూర్ణత్వ మందినకాశ్మీరనందన మదె
గంగోత్తరాస్థితఘనశాంతిగుహా మొదల్ సాధూత్తములతపఃస్థానము లివె
బోధిగుహావాసమున్ జ్ఞానకుటీయును పూత మొనర్చినముఖువ యిదియె
గురువరుపదాబ్జములఁజేసి పరమపావ । నంబు లగు పెక్కుతావులున్నవి యిచటనె
కేలు నడుమేల కొత్తనివేశ మిదియె ॥హిమగిరి॥ ౨౫

ఎవ్వానినామంబు నెనసి జ్ఞానానందవర్ణముల్ పరమపరిభావమందు
నెవ్వానిశుభరూప మెన్న లోకాతీతసౌందర్యరాశియై సన్నుతమగు
నెవ్వానిదయచేత నీసర్వలోకంబు చల్లగ వర్ధిల్లి యుల్లసిల్లు
నెవ్వానిబోధన మీప్సితమోక్షంబు నిచ్చి భక్తులఁ దరియింపఁజేయు
నెవనిపూర్ణత్వ మవ్యయ మెల్లయెడల । నెవనివర్ణింపఁ దరమగా దెవరికైన
నట్టిమద్గురు వర్యువిహారభూమి ॥హిమగిరి॥ ౨౬

బ్రహ్మతత్త్వాద్వైతపద్యముల్ ప్రజలకుఁ గాశ్మీరవనభూమి గారవ్యమయ్యె
పూర్ణసూత్రాఖ్యసంపూర్ణతత్త్వార్థంబు గంగోత్తరను జనుల్ గాంచనయ్యె
దార్శనికం బగుతన్మహాప్రవచన మాజర్మనీస్థలిన్ వ్యక్తమయ్యె
దేశకాలాదిసందిగ్ధసమస్యలు ప్రాగ్స్విరిన్ బూరింపఁ బడుటయయ్యె

బహుళశిష్యపరిబోధకపరమతత్వ । ఫణితి లోకంబునందెల్లఁ బ్రాకి సెవని
మహిమ నట్టిజ్ఞానానందమహితపదము ॥హిమగిరి॥ ౭౩

బ్రిహ్మాండమహాకికారణ్యాన నొంటిమై దూరమేగఁగ నటఁ దోవదప్పి
యిటునటు తిరుగాడి యెక్కడ బెబ్బులి యెక్కడ యెలుగుబం టెదురుపడునో
యనుభీతి శీఘ్రముగను బోయి శ్రాంతుఁడై చల్లగాలికి నొక్కచతియ నిలిచి
విశ్రాంతిఁబొంది పైవేగ నేగిన రాతిపడి గుహాలోనుండి వణకి చలికి
పొద్దునసె యెక్కపల్లెకుఁ బోయి యింత । రొట్టెనీఘలఁ బ్రాణంబు నెట్టొనిలిపి
స్వస్థుఁడై యోగి యానందసరణి గాంచు ॥హిమగిరి॥ ౭౪

కాలికిందను రాయి కదలి పాషాణముల్ కొల్లలుగా మీదఁ గూలినపుడు
మంచుగడ్డలు పడునంచిత గోముఖస్థలి గంగగుహాచెంత మెలఁగినప్పు
డొంటి గంగోత్తర నున్నవేళ విషూచివచ్చి యాపన్నత నొచ్చినపుడు
శార్దూలమునకుఁ గాసంతదవ్వుననుండి గాండ్రించుటను విని కలఁగినపుడు
ధైర్యమున కాలినడ గంగ దాటినపుడు । భుక్తివిడి నాలుగామడ పోయినపుడు ।
దిక్కునీవైతి గురువర దివ్యకృపను ॥హిమగిరి॥ ౭౫

---

## ఋ షు లు

ఒకకొన్ని దినముల నుండదు సూర్యునిపొలకువయైన సమోదమంద
నొకకొన్ని నాళుల నడురాజదర్శనంబైనను పొసగ దాహ్లాదమంద
నొకకొన్ని యహములే నడుగదు వర్షంబు బాహ్యవిహారానుభవమునంద
నొకకొన్ని దివములే నూరకుండదు మంచు కన వసదృశ్యముల్ కలవుదీర
రాకపోకల కలవియోగాకయుండు । తినుపదార్థములను తేర ననువుగాదు ।
తగును గుహానుండి మౌనులు తపముసేయ ॥హిమగిరి॥ ౮౦

కాఫీలు నుప్మాలు కమ్మనినేయిపాల్ వాంఛింపరిటు ఋషివర్యులెపుడు
గారెలు బూరెలు కడుపునిండుగ తిండ్లు వాంఛింప రిటు ఋషివర్యులెపుడు
తాంబూలములు హంసతల్పంబులును దిండ్లు వాంఛింప రిటు ఋషివర్యులెపుడు
పాదసంవాహనప్రముఖసౌఖ్యంబులు వాంఛింప రిటు ఋషివర్యులెపుడు
విప్రులింటనె యెప్పుడు భిక్షవలయు । వనుతు పొసగదు రొట్టియయును జలంబు ।
ధాలుకునోటునఁ దిని గుహ కరుగవలయు ॥హిమగిరి॥ ౮౧

మాటలాడఁగ నొక్క మనుజుండు కలవగుచోటఁ గ్రోధమునకుఁ జోటుకలదె
యుత్తరంబులును బ్రత్యుత్తరాల్ లేనెడ మోహబంధమునకు మొదలుగలదె
తినఁదిండియే లేనిదేశములోపల మదమత్సరములకు మనికిగలదె
కూడుగుడ్డయు లేనికోనలయందున గామలోభములకు గీముగలదె
గుహల మనువారలకు బంధకోటికలదె । కాన సాధువిశేషులఁ గలఁచి భవము।
తఱిగి సులువుగ సాధకుల్ పరముగంద్రు। హిమగిరిస్థలి మాహాత్మ్య మెన్నఁదరమె॥ ౨

భూతలశయనంబె పొందైనవిరిసెజ్జ, గిరిమార్గములె రాజవరపథములు
ముడిబియ్యపన్నమే ముఖ్యమౌభోజ్యంబు, ప్రవహించుఝరినీరె పానకంబు
సోపానములకొండ లేపారుభవనముల్, మంచిపర్వతగుహా మందిరంబు
చెట్లు గుట్టలు రాళ్లు చిఱుతజంతులె సఖుల్, మందమారుతమె సంబంధిజనుఁడు
పరమగురుదత్తమంత్రమె పఠనమనన । ఘననిదిధ్యాసనమునకు సనువు మునికి ।
సన్యసంసారవృత్తులు త్యాజ్యములగు ॥హిమగిరి॥ ౩

యమనియమంబుల ననువుగా సాధించి యోగ్యాసనంబున నుండి గుహను
కొనసి ప్రాణాయామమున వాయుబంధన మలరఁ బ్రత్యాహార మభివసించి
ధారణధ్యానసాధనముల గురుదత్తహితలక్ష్యమునఁ దనదృష్టి నిల్పి
సమధికనిర్ద్వంద్వసత్సమాధిస్థితి తైలధారారూపతను ఘటించి
యుత్తమంపుబ్రహ్మాకారవృత్తి నెపుడు । బరగుచుండుదు రమలులౌ పరమయతులు।
వారిదర్శనమున భవబంధ ముడుఁగు ॥హిమగిరి॥ ౪

రాజులమా ? కాదు, రాజ్యముల్ పనిలేదు, ధనికులమా ? కాదు ధనము లేల ?
యధికారులముకాము, హంగులు పనిలేదు భోగులమునుగాము భోగ మేల ?
కాముకులముకాదు కాంతలు పనిలేదు బలవంతులముగాము బల మదేల ?
యజమానులముకాము యజ్ఞముల్ పనిలేదు సంసారులముకాము జన్మ మేల ?
మాకుఁ జాలు గుహావాస మాకలములు । సిరులు సంపదలును హరిసేవనంబె ।
యనుచు సాధులు నిస్పృహ నచట నుండ్రు ॥హిమగిరి॥ ౫

---

## యాత్రికులు

వెలవఁ డితరులవింతమాటలు విని కష్ట మేమాత్రము గలుగబోదు
పథముల నెట్టియపాయము గలుగదు తగినరక్షణ మటఁ దానె గలుగు
బంగారు మెరుగంగ వైచుచుఁ బోవచ్చు దొంగలమాట వినంగ రాదు
దేశదేశప్రజల్ స్త్రీవృద్ధసహితము వత్తు రోయాత్రికుల్ పయన మగుడు
వ్యయము మిక్కిలియునుగాదు వరలు నందుఁ బుణ్యతీర్థముల్ యాత్రలఁ బుణ్యనదులఁ
జూరవనేయుఁడు ముక్తిని జూరగొనుడు ॥హిమగిరి॥ ౬

అమర నీహారాద్రియద్భుతమహిమలఁ జెప్పంగ వినుటయే చెవులఫలము
హరిహిమాలయయాత్రాహ్లాదకోక్తుల నుడువుటయే సుమ్ము నోటిఫలము
సురతరావళ్యాయగిరివనస్థలుల్ గాంచంగ నేసుమి కనులఫలము
ప్రబలగిర్యధిరాజభవ్యగుహావళీ తాపసస్నేహమే తనువుఫలము
విమలగంగాతరంగిణీ విపులతీర । వాసయోగాగ్ని సందగ్ధవాసనాది ।
మోక్షసాధనమే జన్మముఖ్యఫలము ॥హిమగిరి॥ ౯౭

జాహ్నవీపరిపూతజలసేవనముచేత పాపకర్దమములు పాసిపోవు
బహుళఋష్యాశ్రమపవనసంస్పర్శంబుచే దుఃఖమేఘముల్ చెదరిపోవు
కేదారముఖ్యసుక్షేత్రసేవాసిచే సంసారబంధముల్ ధ్వంసమగును
జ్ఞానప్రభాభాసిసాధుమైత్రిప్రాప్తి నజ్ఞానభవతమం బణఁగిపోవు
గిరిగుహావాససాధనాచరణకవిత । దివ్యజీవనసంప్రాప్త ధీవిశేష ।
మనసె లభియించు బ్రహ్మసమ్మోదసిద్ధి ॥హిమగిరి॥ ౯౮

గిరిరాజసుందరసరణి బ్రయాణమౌ పదములు దేవలోకపథము గనునె
గంగోత్తరానీలకంఠపూజాలగ్న హస్తంబు లన్యసమర్చఁ గనునె
జాహ్నవీత్రిషవణస్నానపావనమైనశిరము దేవలోకవారిఁ జేరనగునె
బదరీశుపదపద్మభక్తిపూరితమైనతలఁపు దేవలోకకూటిఁ దగులనగునె
శిఖరసంవాసివిఖ్యాతసిద్ధసంఘ । బోధసామృతసంతృప్త సాధుజీవ ।
నమునఁ జరియించునరున కన్యం బదేల ॥హిమగిరి॥ ౯౯

ఘనహృషీకేశంబుఁ గాంచి జాహ్నవిదారి నరిగి జమ్నోత్రి ముందరసి పిదప
గంగోత్తరను జేరి క్రమ్మతి కేదారనాథంబుఁ జూచి యనంతరంబు
బదరీశు దర్శించి బ్రహ్మకపాలంబునందు పితరుల నానందపఱచి
మఱలి వచ్చుట సర్వమార్గము నలువదిదినములఁ బూర్ణమౌ తెగువగల్గు
వారు కైలాసమానస వరసరస్సు । లరయ గిరిదాటి టిబ్బతు కరుగుచుందు ।
రమరనాథాదియాత్రి లన్యములు గలవు ॥హిమగిరి॥ ౧౦౦

సరదార్లు రాజు లశ్వముల నాగోహింత్రు, కొంచెపువార లెక్కుదురు ఖరము
ధనికులు వృద్ధులు గొనుదురు డోలీలఁ దక్కువవారికిఁ దగును కండి1
వేసడంబులు మోయఁ బెద్దలబరువుల కొలదినారలసరములను మూపు
సొమ్మున్న యెడల మేజోడు మేలౌబూటులలతివారలకుముచ్చటలలభించు

1 వీపుకుర్చి

వన్నెటుమ శ్రేష్ఠ మనహాయ మధుహారంబు। కామితార్థదమును రెండుకాళ్లబండి
పయనములు సాగు నిటు సుఖప్రదములగుచు॥హిమగిరి॥స్థలి మాహాత్మ్య మెన్నదరమె॥

నేయి కారంబును నిమ్మకాయలు పిండ్లు నూనెలు లాంతర్లు బూనవలయు
మన్నిచొక్కాల్లాగు బరువైనకంబళ్ళు బూడ్సు కట్టలు గొనిపోవవలయు
గంగచెంబులు చిన్నకంచుపాత్రలు కొన్ని మందులు మాత్రలు లమర్చవలయు
పైయుత్తరీయంబు బరువగు నటు మీకు కొండవాఁ డొక్కఁడు కూలి వలయు
బాలముసలమ్మ లున్న డోలీలు వలయు। పాలపసిపిల్ల లున్న కండీలు వలయు।
ధైర్యమును భక్తి వలయును తైర్థికులకు ॥హిమగిరి॥ ౧౦౨

కనుపడ్డనీళ్ళన్ని గళమునం దిడబోకుఁడుష్ణోదకంబులే యుత్తమములు
కనుపడ్డచిఱుతిండ్లు కబళింపగాబోకుఁడేకభుక్తమె యాత్ర లోకహితము
కనుబడ్డచిఱుబాటఁ గాలిడబోకుఁడు రాచబాటయె సుఖప్రదము మీకు
కనుపడ్డపండాల ఘనమాయఁ బడకుఁడు స్వాతంత్ర్యమనునంటు భద్రమగును
ఒంటి గిరిమార్గములయందు నుండవలదు। దవ్వుమజిలీలు చేయ నాత్రంబు తగదు।
దిక్కులను చూడకుండు యాత్రికులు త్రోవ ॥హిమగిరి॥ ౧౦౩

1 చట్టిలోపల దిగి సాహుకారును బిల్చి 2 చావలు 3 దాల్ 4 గర్మసాల 5 మిర్చి
6 హల్ది 7 నమక 8 ఇమ్లి 9 ఆలు 10 చీనీ 11 లక్డి 12 ఆటాప్రభృతులు 13 దేవ్
అనగవలయు
పైస 14 లేవ్ అని యైనవ్యయము మిచ్చి ధర్మశాలను జేరి గంగాజలంబు దెచ్చి
దినము తానము వీడి దృష్టిదోషముమాని పాకభోజనము తేర్చుకొవలయు
మంచి విశ్రాంతి నందియు మనమునందు। శ్రీహరి నుమేశు గంగను జేరి కొల్చి
యాత్రికులుకూడి యుందఱు నరుగవలయు ॥హిమగిరి॥ ౧౦౪

హిందీ ప్రధానకా నీవేళ మం దది రెండుముక్కలు నేర్చియుండ సులువు
మనకూలివానిచేతను నీళ్లుకట్టెలు దెప్పించుకొనఁ గడు తేలికను
అడుగడ్డునకుఁ గాళ్లుగడుగునాచారము తడిగుడ్డ చన్నీళ్ల విడుట సుఖము
పైకము పెట్టెలోపల దాచుకంటెను బొడ్డుకొంగునను దాపురము మేలు

1 దుకాణము. 2 బియ్యము. 3 పప్పు. 4 తిరుగబోతగింజలు. 5 మిరపకాయలు.
6 పసుపు. 7 ఉప్పు. 8 చింతపండు. 9 బంగాళాదుంపలు. 10 పంచదార. 11 కట్టెలు
12 గోధుమపిండి. 13 ఇమ్ము. 14 పైకముతీసికో.

ఇంటిగోడవలు తగవులు హిహిహిహీలును । మీదుమిక్కిలిమాటలు మిగుల వదలి ।
ధ్యానమున నీశు సేవయే మంచిదగును ॥హిమగిరి॥ ౧౦౪

భాగీరథీ! భక్తపాపప్రహారిణీ! బ్రోవవే యని గంగ మ్రొక్కవలయు
శంకర! భక్తవశంకర! రక్షింపు శరణంచు శివు నుతిసలుపవలయు
పార్వతీ సతతశుభప్రతిపాదినీ! నను గావవే యని యుమఁ గాంచవలయు
విఘ్నేశు షణ్ముఖు విష్ణువు లక్ష్మిని చేమోడ్పులతో భక్తిఁ జేరవలయు
వ్యాసు వాల్మీకి జమదగ్ని నత్రి నఖిల । ఋషుల నాయాయిచోటుల కేగి మ్రొక్కి ।
పోకు మందంగ భైరవుల జ్ఞానవలయుము ॥హిమగిరి॥ ౧౦౫

---

## వీడ్కోలు

## ఫలశ్రుతి–మంగళము

అన్న! రావయ్య నీయాలింగనం బిమ్ము, గిరివాసి! నన్నీవు మఱవకయ్య!
అమ్మ! ఈమారు నీయాశీర్వచన మిమ్ము తలఁపుము గిరికాంత! దయను నన్ను
తమ్ముఁడ! రావోయి! తగ నొక్కముద్దిమ్ము గిరిబాలకుండ! యేగెదను పురికి
చెల్లెల! రావమ్మ! చిన్నినాటి మాట మాపు స్మరియింపు గిరికన్య! మదిని నన్ను
శిశువ యొలికింపు మొకసారి చిఱునగవును । పశువులారా! యికే పోయివత్తు నుండి
యనుచు నీరీతి యాత్రికుఁ డడుగు సెలవు ॥హిమగిరి॥ ౧౦౬

ఇంటివారలతోడ నిరుగుపొరుగువారు కదలివత్తురు మిత్రు గడవనంపఁ
గన్నీరు కాలువల్ గట్ట దుఃఖించెద రెడబాటునకు సహియింపలేక
యిట్టిస్నేహము మాకు నీజన్మమున రాదు! దేవుఁడా! మాదురదృష్ట మందు
రెపుడు మీరాకకు నెదురుచూచెద మంచు మనమున జింతతో వెనుక నుందు
రింటియజమానుఁడును గుఱ్ఱ్రము లింక విడక । చాలకోసులు వత్తురు సాగనంప
గొండకాపుల ప్రేమకుఁ గొలది కలదె ॥హిమగిరి॥ ౧౦౭

కొండలారా! గొప్ప యండ నే బాయుదున్ బోవలె సెలవిండు పోయివత్తు
వనములారా! మిమ్ము వదలుటే కష్టమా పోవలె సెలవిండు పోయివత్తు
గంగాంబ! నే నిన్ను గాంచుట యెప్పుడో పోవలె సెలవిమ్ము పోయివత్తు
శ్రీకాంత! నీకర్చ సేయంగ నెపుడౌనొ పోవలె సెలవిమ్ము పోయివత్తు
ఓయిగాడ్పులు! మబ్బు! లోహహోయితరులు । నోయిపథములు! సెలవిడుఁ డూరి కేగ
నంచు వీడ్కోలను యాత్రికుఁ డచటు నాసి ॥హిమగిరి॥ ౧౦౮

హరిణమా! మాయూరి కరిగివత్తము రమ్మి యీవేళవత్తు నీయిరవునుండి
కోకమా! నాతోడఁగూడిరాఁగదె నీవు నీవేళవత్తుని సెలవునుండి
దేవదారువ! రాఁగదే నీవు మాయూరు నీవేళవత్తు నీతావునుండి
మధురసప్రవంతినీ! మాయూరు రాఁగదే నీవేళవత్తు నీసెలవునుండి
చిన్న జంతువుల్! తీవలు! చేర రండు । రారు విడఁజంగలారె మీవారి మీర
లనుచు సెలవందు నీరీతి యాత్రికుండు హిమగిరిస్థలి మాహాత్మ్యమెన్నఁదరమె॥ ౧౧౦

ఇఁకనెటుల్ గాంచెద హిమశైలసంజాత పూతమాహేశ్వరి బుణ్యజనని
నిఁకనెటుల్ వీక్షింతు నిందుకళాశోభి ఘనజటాయుతు నుమాకాంతు జనకు
నిఁకనెటుల్ గననగు నినకాంతిచిత్రితనీహారశిఖరమండితు గిరీంద్రు
నిఁకనెటుల్ గందు నే నిట్టిసుఖప్రదుఁడౌ మందమారుతు బ్రాణసఖుని
నిఁకనెటుల్ గాంతు గిరిజలహితమధురత । నిఁకనెటుల్ గాంతు సైకతమృదులశయ్య
నిఁకనెటుల్ గాంతు ఋషివరప్రకటకరుణ ॥హిమగిరి॥ ౧౧౧

దయ యుంచవమ్మ నీదాసానుదాసుపై బదరీవిశాలాక్షి! ప్రథితలక్ష్మి!
దివ్యకటాక్షు మీదీనునిపై నింపు నారాయణా! పరానందమూర్తి!
కృపఁ బ్రసారింపు మీ వెపుడు భక్తునిపైని కేదారతీర్థనికేతనుండ
క్రీగంటిచూపునఁ బ్రేమ బాలింపుమీ యలకనందా! నదీ! యనఘచరిత
సేవకుస్మరింతువే గిరిదేవ! నీవు । శిష్యు నేమఱుము గురూ! సిద్ధవర్య ।
పోయివత్తును శీఘ్రమే పోయివత్తు ॥హిమగిరి॥ ౧౧౨

హిమగిరిశతకామృతముఁ గ్రోలువారికి నాయురారోగ్యసౌఖ్యంబు లమరు
నిది విన్నఁ జదివిన నిచ్ఛ జనించును హిమశిఖరికి యాత్ర లెపుడు సేయ
తీర్థయాత్రలచేతఁ దెగి భవదుఃఖముల్ హృదయ మోహనిపయి కుదురుకొనును
చిత్తసుస్థిరతయుఁ జేకురునంతనే భక్తున కందును ముక్తిఫలము
తపముసాగించి యోగసాధనముచేత । పూర్ణసామాధికస్థితిఁ బొంది నియత ।
మాపరబ్రహ్మతో నైక్య మందు నరుఁడు ॥హిమగిరి॥ ౧౧౩

జయ సర్వగిరిరాజ! జయ హిమాలయవర్య! జయ వనగమణీయ! జయ శుభాంగ!
జయ మనోహరదృశ్య! జయ జంతుపోషక! జయ రత్నభాండార! జయగుణాఢ్య!
జయ పార్వతీపిత! జయ శంభుపూజిత!జయ జాహ్నవీతాత! జయ మహార్హ!
జయ మహోన్నతరూప! జయ పుణ్యతీర్థాత్మ! జయ భక్తమందార! జయ పవిత్ర!
జయము, సకలామరస్తుత్య! జయము, నిత్య! । జయము, సిద్ధర్షిసేవిత! జయమునేత!
జయము, మోక్షామృతనిధాన!జయముస్వామి।జయముజయమగుసర్వత్రజయముజయము.

---

# తప్పొప్పులపట్టిక.

---

| పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧-౪-౧౩-౨౨ | ౬ | స్థలిమా | స్థలి మా |
| ౧౭ | ౬ | మేదేని, | మేదేని |
| ౨౫ | ౫ | నీహార | నీహార |
| ౫౮ | ౨ | అవ్యక్తి | అవ్యక్త |
| ౫౮ | ౩ | మెడిలోని | మెదలోని |
| ౫౮ | శీర్షిక | గిరుశిశువు | గిరిశిశువు |
| ౫౧ | ౬ | గిరుశిశు | గిరిశిశు |
| ౭౯ | ౧ | ఒఱగడ్డము | ఒఱగడ్డముల |
| ౮౩ | ౨ | జగద్గురు | మహాకవు |
| ౮౪ | ౧ | సామహా | సామమహా |
| ౯౮ | ౫ | కవిత | కలిత |
| ౧౦౧ | ౩ | నారల | వారల |
| ,, | ,, | సరకులను | సరకులకు |
| ౧౦౪ | ౨ | నమక | నమక్ |
| ,, | ౩ | పైసె 14 వేల్ | 14 పైసలేవ్ |
| ,, | ౪ | ఏర్పఱప | ఏర్పఱుప |
| ౧౦౬ | ౩ | పార్వతీ | పార్వతీ! |
| ౧౦౯ | ౨ | వదలుటే | వదలుట |
| ౧౧౨ | ౪ | అలకనంతా? నదీ! | అలకనందానదీ! |
| ౧౧౪ | ౫ | సకలానుర | సకలామర |

---

# మార్కండేయభవనము,

నరసరావుపేట, గుంటూరుజిల్లా

---

ప్రచురణములు—త్యాగివిరచితములు.

| | | | |
|---|---|---|---|
| 1 | కథాకావ్యము | (గద్యము) | 0—12—0 |
| 2 | కథాకావ్యము | (పద్యము) | 0—12—0 |
| 3 | సచ్చిదానందము | (నవల) | 1— 0—0 |
| 4 | చిద్విలాసము | (నాటకము) | 0—12—0 |
| 5 | హిమగిరిశతకము | | 0— 2—0 |
| 6 | గంగాపంచకము | | 0— 1—0 |

శ్రీజ్ఞానానందస్వామివారి కృతుల కాంధ్రీకరణములు వెలువడనున్నవి.

| | | |
|---|---|---|
| 1 | దార్శనికమహాప్రవచనము | (గద్యము) |
| 2 | నిర్వాణము<br>జ్ఞానానందసువర్ణమాల | (పద్యములు) |
| 3 | పూర్ణసూత్రములు | |

ఇతరులవి.

| | | | |
|---|---|---|---|
| 1 | విజ్ఞానభక్తితరంగిణి | శ్రీమత్ప్రి జ్ఞానానందస్వామిది | 0— 4—0 |
| 2 | గాయత్రీమంత్రార్థ వివరణము | శ్రీమత్ప్రిజ్ఞానానందస్వామిది | 0— 2—0 |
| 3 | జ్ఞానదీపికా (గీతావ్యాఖ్య) | ,, | వెలువడును |
| 4 | కైలాసయాత్ర | ,, | వెలువడును |